దర్శింప వచ్చి యుండెను. విజయనగర రాజ భవనమున దశరా దినములలో మహానవమి మహోత్సవ మత్యంత వైభవముతో జరగినట్లు అతడు వర్ణించి యున్నాడు. అందు వైదేశికు డగు నతడు ఆ మహోత్సవ సమయమున నద్భుతావహము లగు నాట్య ప్రదర్శనములు జరగినట్లు పేర్కొని యున్నాడు. 'ఈ స్థలమునకును, మంటపముల కును నడుమ చక్కగా తీర్చిన కాళీ స్థలము కలదు. అందు గాయకులు గానము చేసిరి; కథకులు కథలు చెప్పిరి. గాయకురాండ్రలో నధికాంశము లేబ్రాయపు కన్యలే. వారి బుగ్గలు చంద్రునివలెను, వారి మొగములు వసంతము నతిశయించిన శోభతోను ఒప్పుచుండినవి. వారు ధరించిన వస్త్రములు సొగసయినవి. క్రొత్తగా విచ్చిన గులాబి పూవులవలె వారి రూపములు మనసున కమితానందము కలిగించినవి. వారు రాయల కభిముఖముగ నున్న తెరకు మరుగున కూర్చుండి యుండిరి. అకస్మాత్తుగా రెండు వైపులనుండి తెర తొలగింపబడినది. అంత నా బాలికలు సుంపర విపేపను చూరదపోవునట్లును, ఆత్మ లానంద పరవశము లగునట్లును లలిత పద విన్యాసములతో నృత్యము చేయనారంభించిరి' అని యతడు వ్రాసెను.

క్రీ.శ. 1433 - 34లో మడమను గ్రామములోని అగ్నీశ్వర దేవాలయ దేవదాసి - అరంవళత్తనాచ్చియార్ అను అరవ దేవదాసి - రెండవ దేవరాయలను సందర్శించి, అతనివలన నొక దేవాలయముకొరకు దానము పడసెను. సాళువ తిరుమలరాయల సోదరుడును, రెండవ దేవరాయల కాలమున దుర్గపాలకుడునైన గోపేంద్ర తిప్పరాజు తాళ దీపిక యను ప్రత్యేక తాళ లక్షణ గ్రంథమును రచించెను. అతడు వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తులకు తాను రచించిన లఘు టీక యొక్క ప్రస్తావన శ్లోకములం దొక దానివలన తాను శివాంకితముగ నొక తాళ ప్రబంధ మును రచించినట్లే గాక నాట్యమునకు సంబంధించిన యొక గ్రంథమును ('శివా ర్లుప్తాకారా నటన కరణా నామపి భిదాః') వ్రాసినట్లును తెలియుచున్నది.

ఇమ్మడి ప్రౌఢ దేవరాయ లనబడు మల్లికార్జున దేవ రాయల కాలము (క్రీ. శ. 1446 - క్రీ. శ. 1465) లో చతుర కల్లినాథుడు రచించిన కళానిధి నామకమగు సంగీతరత్నా కరవ్యాఖ్యానము విజయనగర యుగమున వెలువడిన ఉత్తమ సుప్రసిద్ధ గ్రంథము. సింగభూపాలుని వ్యాఖ్యానము కన్న ఈ కల్లినాథుని వ్యాఖ్యానము ప్రశస్త తరము. సంగీతరత్నాకరమునందలి కడపటి యధ్యాయమునకు చేసిన వ్యాఖ్యానమువలన కల్లినాథుని నాట్యకలా పాండిత్యము స్పష్టమగుచున్నది. శ్రీకృష్ణదేవరాయల కాలమున (క్రీ. శ. 1509 - క్రీ. శ. 1530) అంతఃపుర స్త్రీ జనమునకు నాట్యాచార్యత్వమును వహించి యుండిన బండారు లక్ష్మీ నారాయణ పండితుడు సంగీత సూర్యోదయ మను నొక గ్రంథమును రచించెను. అందు నృత్యమును గురించిన అధ్యాయ మొకటి కలదు. అం దతడు శార్ఙ్గదేవ, కోలాహల విరచిత గ్రంథముల ననేకపర్యాయము లుదాహరించి నాడు. ఓఢ్రరాజగు వీరరుద్ర గజపతియొక్కయు, విజయ నగర ప్రభువగు కృష్ణదేవరాయలయొక్కయు పోషణమున వెలసిన లొల్ల లక్ష్మీధరుడు తన సౌందర్యలహరీ వ్యాఖ్యా నాంతమున తాను రచించిన పెక్కు విషయములను వివ రించు సుదీర్ఘ గద్యయందు తన పూర్వులలో తన కైదవ తరమువాడగు విరించిమిశ్రుడు భరతార్ణవపోత మనునాట్య గ్రంథము నొక దానిని రచించినట్లు చెప్పి యున్నాడు.

సాహిత్యమునకంటె నధికముగ హంపి శిల్పములును, విదేశ యాత్రికులగు బర్బోసా, పేయస్ మొదలగువారు రాయల యాస్థానమునుగురించి, రాజధాని యందలి ప్రజా జీవిత విధానమును గురించి వ్రాసిన వృత్తాంత ములును విజయనగర రాజుల కాలమున నృత్యకళ పొందు చుండిన గౌరవాదరములను తెలుపుచున్నవి. ఈ విదేశ యాత్రిక వృత్తాంతములలో అప్పటి వేశ్యాంగనలయొక్క సంపత్సమృద్ధికిని, వారికి ఆస్థానికులతోడను, ఇతర ప్రము ఖులతోడను గల సంబంధానుబంధములకును ప్రస్తావము కలదు. శుద్ధాంత కాంతాజనముకూడ నాట్యకళ నభ్య సించుచుండెను. పేయస్ రచియించిన వృత్తాంతములో నర్తకీజనము నాట్యము నభ్యసించుచున్నట్టిదియు, ప్రదర్శించు నట్టిదియు నగు నర్తనశాల వర్ణనము మిక్కిలి ముఖ్య మయినది. 'నర్తనశాల సుదీర్ఘమయినది, కాని అంత వెడల్పు గలది కాదు. చావడియందు గోడనుండి సరిగా రెండు మూరల దూరమున శిల్ప రమణీయము లగు శిలా స్తంభ ములు గలవు. ఆ స్తంభ ఫలకములపై నాట్యాంతమున నుండవలసిన సరియైనతీరులతో నొప్పు నాట్యకత్తెల రూప ములు చెక్కబడి యున్నవి. నృత్యము నభ్యసించువారు నృత్యాంతమున తా ముండవలసిన వైఖరిని మరచిపోయిన యెడల, అట్టివారు ఈ శిల్పచిత్రములను చూచి తా ముండవలసిన తీరును జ్ఞాపకము తెచ్చుకొందురు. ఈ నర్తన శాల తుదను ఎడమచేతివైపున చిత్రలేఖనములు గల యొక యేకాంతస్థలము కలదు. అచట నాట్యకత్తెలు తమ శరీరములను, కాళ్ళను చక్కగా జాపి సడలజేసి కొనుటకై వ్రేలాడుదురు. వారి నృత్యము సుందర తరముగ నుండునట్లు చేయుటకుగాను శరీరము తేలికగా వంగునట్లు చేయుట కచ్చట నేర్చుకొందురు. నర్తనశాల

యొక్క మూర్తి... తుదను కుడివైపున నాట్య ప్రదర్శన ముగించు... రాజు కూర్చుండు ప్రదేశమున నేలమీదను, ...మీదను బంగారు రేకులు తాపబడి యుండెను. ...డిమి భాగమున పండ్రెండేండ్ల బాలిక ప్రమాణము... సువర్ణ విగ్రహము కలదు. ఆ విగ్ర హము... చేతులు నాట్యాంతమున నుండ వలసిన ... యుండును'. ఈ నాట్య మందిరము నాశముకాక యుండిన యెడల నాట్యకళా సంప్రదాయ పునర్నిర్మాణ మున కిది యంతకన్న సహాయకారి మరియొకటి యుండెడిది కాదు; తంజావూరు, చిదంబరములతోపాటు విజయ నగరముకూడ భరతనాట్య శాస్త్రమునకు మూడవ శిలా శిల్పమయ భాష్యమై యుండెడిది. విజయనగర శిథిల ములలో నేడు మిగిలి యుండునది నలువైపుల ప్రక్కల యందు నృత్య శిల్పచిత్రములు గల సింహాసన వేదిక మాత్రమే. ఆ కాలమునాటిదే యగు తాడిపత్రి దేవాలయ మునను నృత్య శిల్పఫలకములు గలవని తెలియుచున్నది.

కృష్ణదేవరాయల యుద్యోగులలో నొక్కడైన నాదెండ్ల గోపన్న మంత్రి ప్రబోధచంద్రోదయ మను నాధ్యాత్మిక రూపకమునకు వ్యాఖ్య రచియించెను. అతడు నాట్య శాస్త్ర గ్రంథ కర్తలలో శృంగనాచార్యుని నామమును రెండు మూడు మారు లుదాహరించెను. ఈ శృంగనా చార్యుడు పెదకోమటి వేమారెడ్డికాలమున నుండి, సంగీత రత్నాకరమునకు తెలుగు వ్యాఖ్యానము రచించి నట్లు తెలియవచ్చిన సింగనభట్టు కావచ్చును.

సంగీత దర్పణమును రచియించిన చతుర దామోదరుడును ఆంధ్రరచయితగా తోచుచున్నాడు. అందు ప్రబంధాధ్యాయమున నితడు నృత్య విషయమును ప్రస్తావించుటయే కాక కడపటిదగు ఆరవయధ్యాయమున కేవలము నృత్త విషయమును వివరించినాడు. ఈ నృత్తాధ్యాయమున నాతడు దాక్షిణాత్య నృత్య ప్రబంధములను వివరించెను.

మీద పేర్కొనిన గ్రంథములకంటె ముఖ్యమయినది దేవన(దేవేంద్ర)కృతమగు సంగీతముక్తావళి. ఇది మరియొక దాక్షిణాత్య నాట్యశాస్త్ర గ్రంథము; బహుశః ఆంధ్రకర్తృకమే కావచ్చును. నృత్తాభినయ విషయములు రెండింటిని బట్టిచూడ ఇది యమూల్యగ్రంథమని చెప్పదగియున్నది.

తరువాత దాక్షిణాత్య సంగీత, నాట్య కళలు తంజావూరు నాయకరాజుల, విశేషించి రెండవ మూడవ ప్రభువులైన రఘునాథ, విజయరాఘవ నాయకుల యుదార పోషణమున నాంధ్రులచే పునరుజ్జీవితములైనవి. కాలక్రమమున సంస్కృత సంగీత, నాట్య శాస్త్రములను గూర్చిన గొప్ప గ్రంథములకు మారుగా ఆయా కళలయందు పేరు గన్న సంప్రదాయ వేత్తలును, ప్రయోగ నిపుణులును నగు నాట్యాచార్యులు రచించిన సంగ్రహరచనములు, ఖండ రచనములు, ప్రకీర్ణకములునైన గ్రంథములు బయలుదేరినవి. ఆ కాలములోనివారు గొప్ప గ్రంథములు వ్రాయగల పాండిత్యాతిశయము గలవారు కారు. అయినను అట్టివారు వారి కాలమున బయలుదేరిన వానిలో ముదుంబ నరసింహాచార్యులవారి భరతసర్వార్థసంగ్రహము, ...నాగ్యుని నాట్యచూడామణి, శుద్ధసత్త్వ వెంకటాచార్యులవారి అర్జునాదిమతసారము అను మూడు గ్రంథములు పేర్కొనదగినవి. వ్రాతప్రతులలో తెలుగు వ్యాఖ్యానములేని ప్రామాణికామూల్య నృత్త, సంగీత గ్రంథములేవియు ...లేవు. వాస్తవమునకు నాట్య, సంగీత కళలందు తెలుగునకు మంచి ప్రాభవ ముండెను. నిన్నమొన్నటివరకును కర్ణాటక సంగీతము పాడువానికి తెలుగుభాషాజ్ఞాన మావశ్యకమై యుండెను.

ఆంధ్రదేశము నందలి బ్రాహ్మణ పండితులు భాగవత ధర్మములో నొక యంగముగా భగవన్మహిమాప్రకాశకములగు కథలను గేయ సంకీర్తనములుగను, నృత్యరూపములుగను రచియించి ప్రదర్శించు సంప్రదాయమును ప్రచారమునకు తెచ్చిరి. జయదేవుని గీతగోవిందరచన కాలమున నారంభమైన యీ సంప్రదాయమును కూచిపూడిలోని ఆంధ్రబ్రాహ్మణ భక్తబృంద మవలంబించి యభివృద్ధి కావించెను. తంజావూరి సమీపమునందలి గ్రామములలో ఉద్భవించి తరువాత ప్రాముఖ్యమునందు వచ్చిన తెలుగు భాగవతనాట్య రూపక సంప్రదాయము కూచిపూడి సంప్రదాయమునకు శాఖారూపమే. దక్షిణదేశమందలి నాట్యకళయొక్క చరిత్రలో ... భాగవత రూపకములతో సమానముగ ప్రధానములైనవి, తెలుగువారు ఆ కళకు కానుకగా నిచ్చినవి క్షేత్రజ్ఞ (క్షేత్రయ) విరచితములై అభినయమున కుద్దిష్టములైన పదములు. పద మనగా రసమంజరి మొదలగు గ్రంథములలో పేర్కొనబడిన వివిధజాతి శృంగారనాయికా, నాయకులలో ఒకజాతి నాయికా, నాయకుల శృంగార రసావస్థావిశేషము నభివర్ణించు గేయము. అమరుశతకము మున్నగు సంస్కృతరచనముల యందలి శృంగార ముక్తకములు సైతము క్షేత్రజ్ఞపదముల యుత్పత్తికి కారణములై యుండవచ్చును. రాగమాధుర్యముచేతను, తెలుగుశయ్యాసౌఖ్యముచేతను, రస భావ సంపదచేతను ప్రసిద్ధిగాంచిన క్షేత్రజ్ఞపదములం దభినయ కల్పనకు మంచి అవకాశము కలిగినది. గీతగోవింద, మేఘదూతలవలె క్షేత్రజ్ఞపదములును పలువురు పదకవుల సరస రచనలకు కారణమైనవి. ఇవియు నభినేయములే. వి. రా.

# ముఖ్య విషయ వివరణము

## (అకారాద్యనుక్రమము)

'అంధకరట్ట'ము గోదావరి తీరమున నుండినట్లు బౌద్ధ వాఙ్మయమున పేర్కొనబడిన దేశము. దీని సమీపమున బావరి యనుముని నివసించుచుండినట్లు ఆవాఙ్మయము తెలుపుచున్నది. 'సుత్తనిపాత'మందలి 'పరాయనవగ్గ'ములోని 'వత్థుగాథ'లో సుదాహృతులైన 'అస్సక', 'అళ (ముళ)'కులు 'అంధక' రాజులని 'సుత్తనిపాత' వ్యాఖ్యలో గలదు.

అక్కన్న-మాదన్నలు : వీరు కుతుబ్ షాహి సుల్తానులలో చివరివాడయిన అబుల్ హసన్ కుతుబ్ షా కొలువులోని ఉద్యోగులు. హనుమకొండ నివాసియు, సుంకాధికారియు అయిన పింగళి భానుజీ పంతుల కుమారులు. విశ్వనాథుడు, మృత్యుంజయుడు వీరి సహోదరులు. అక్కన్న మాదన్నలు గోలకొండకు వచ్చి మొదట సయ్యద్ ముజఫర్ అను సేనాధిపతి కడగుమాస్తాలుగా చేరిరి. అప్పటికి అబుల్ హసన్ తానాషా సుల్తాను పదవికి వచ్చి ఇంకను సంవత్సరము కాలేదు.



చిత్రము 120.
అక్కన్న 'అప్పర్ బహదర్'



చిత్రము 121.
మాదన్న 'సూర్యప్రకాశరావు'

గోలకొండ సుల్తాను అబ్దుల్లా కుతుబ్ షా కు ముగ్గురు కొమార్తెలు. పెద్ద అల్లుడు సయ్యద్ అహమ్మద్ సుల్తానును బొమ్మగా ఉంచి సర్వాధికారమును వహించి యుండెను. రెండవ కొమార్తెను పెండ్లాడిన ముహమ్మద్ సుల్తాను ఔరంగజేబు కొమారుడు అయినందున ఢిల్లీలో నుండెను. సుల్తాను మూడవ కొమార్తెను పెద్దయల్లుడు తనకు కావలసినవానికిచ్చి పెండ్లి చేయ నేర్పాటు చేసెను. అతడన్న సరిపడక మంత్రులు మూసాఖాన్ సయ్యద్ ముజఫర్ అను వారు మరియొకనిని వెదకుచుండిరి.

అబుల్ హసన్ తండ్రి పార్శ్వమున రాజబంధువు. ఇతడు గొప్ప వర్తకము చేసి తుదకు నష్టపడి మరణించినందున అబుల్ హసన్ పేదరికమున పడి, బందే నవాజ్ హజరత్ అను ప్రాచీనతపస్వి వంశజుడైన సయ్యద్ రాజు కొత్తాల్ అనుమహమ్మదీయస్వాములకు శిష్యుడై విద్యనార్జించి వేదాంతియై పదునాలుగేండ్లు గడపెను. ఇంతలో పెద్దయల్లుడు తెచ్చిన వరుడు అతనితో జగడమాడెను. వానిని తరుమగొట్టి మంత్రులు తమ యుద్దేశములకు తగినవాడని అబుల్ హసనును కొనిపోయి సుల్తాను మూడవ కూతునకు పెండ్లి చేసిరి. క్రీ. శ. 1678 లో అబ్దుల్లా కుతుబ్ షా మరణించెను. మంత్రుల తంత్రమున అబుల్ హసను సుల్తానయ్యెను. ఇతనికి తానాషా అని పేరు కలిగెను. ఇతడు తన మంత్రులు స్వార్థపరులని తెలిసి వారిని తొలగించనెంచినతరుణమందే అక్కన్న మాదన్నలు సుల్తానును దర్శించినది. మంత్రులు సుల్తానును బొమ్మవలె ఆడించుచుండిరి. వారిని తత్క్షణమే తొలగించిన నింద వచ్చుననియు, ఆపని క్రమముగా చేయవలెననియు మాదన్న సుల్తానుకు బోధించి వారికి పరస్పరము విరోధమేర్పడునట్లు భేదోపాయము ప్రయోగించెను. ఒకరితో నొకరికి పడకవారును, వారి సేవకులును కొట్టుకొనునంత వరకు వచ్చినది. ఒకటి రెండు మారులు సుల్తాను వారిని మందలించి తరువాత శిక్షించి పిదప పదచ్యుతులను గావించి వెంటనే 'సూర్యప్రకాశరావు' బిరుదుతో మాదన్నను మహామంత్రిగాను, అక్కన్నను 'అప్పర్ బహదర్' బిరుదుతో సేనాపతిగాను నియమించి వారికి సర్వాధికారములను ఇచ్చెను. వీరి సోదరులలో విశ్వనాథునకు బక్షిగిరి (సైన్యమునకు జీతమిచ్చు అధికారము), మృత్యుంజయునకు పీష్వా ఉద్యోగము, మేనల్లుడు (బావయని కొన్ని ఆకరములు) వెంకన్నకు 'రూస్తంరావు' బిరుదముతో ఫౌజుదారు ఉద్యోగము, ఇంకొక మేనల్లుడు గోపన్నకు

(రామదాసు) భద్రాచలము తాసీల్దారు ఉద్యోగముమ లభించినవి.

మాదన్న అధికారము వహించిన పిదప సామ్రాజ్యములో గొప్ప మార్పు లేవియు తేలేకపోయెను. రాజ్యపాలనముకన్నను రాజ్య రక్షణము పెద్ద పనిగా ఉండెను. అక్కన్న మాదన్నలు తాము చేయుచుండిన పను లన్నియు ప్రతి దినమును సుల్తానుకు నివేదించుచుండిరి.

మంత్రియైన కొలది కాలముననే మాదన్న దేశములో చాల భాగమునకు రక్షణము కలుగజేసెను. మొదటి పనిగా కొండలలోనుండి దేశోపద్రవము చేయు జాతులవారిని శిక్షించి పైరు పంటలకు, గొడ్డు గోదలకును రక్షణ నొసంగెను. జనులను పీడించు జమీందారులను, సుంకపు అధికారులను లాగివేసి రాజ్యమును నిష్కంటక మొనర్చెను. రెండవ పనిగా అన్ని సుబాలలోను ప్రతి గ్రామమును సర్వే చేయించి పన్ను వసూలు పట్టీలు వివరముగా ఆయా సంవత్సరములకు ప్రత్యేకముగా తయారు చేయించెను; ఈనాములు, అగ్రహారములు, దేవ బ్రాహ్మణ దానములు, నౌకరీ మాన్యములు మొదలైన వాని పాలనలోని అక్రమములను మాన్పించెను. హిందువులకు, మహమ్మదీయులకు పక్షపాతము లేక శిక్షణ రక్షణల నొసంగుచుండెను.

తానాషా సుల్తానుకు ప్రతిసంవత్సరము దాదాపు మూడు కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచుండెను. రాజ్యము సకల సంపదలతో తులతూగెను. ఈ సంపద, వైభవము ఔరంగజేబుకు కనుకుట్టాయెను. మొగలాయిలకు శివాజితోను, అతని స్నేహితుడైన ఆదిల్ షాతోను యుద్ధము చేయుచుండినందున గోలకొండపై దాడి చేయుటకు మొదట అవకాశము లేకుండెను. అదియును గాక గోలకొండవారు ఏటేట ఢిల్లీకి కప్పము సక్రమముగా పంపుచుండిరి.

మాదన్న పంతులు కొలది మార్పులతో తత్పూర్వము గోలకొండవారు అనుసరించుచుండిన విదేశాంగ నీతినే అనుసరించెను. గోలకొండవారు పైకి స్నేహితులుగా నుండినను మొగలాయిలకు లోలోపల శత్రువులే. రహస్యముగా వారు బిజాపురము ఆదిల్ షాకు ధనసాహాయ్యము చేయుచుండిరి. ఈ విషయము మొగలాయిలును గ్రహించియే యుండిరి. కాని బిజాపురము పరిస్థితులు చాల గందరగోళముగా నుండినందున శివాజీతో మైత్రి చేసి కొనుట యుక్తమని ఆలోచించి మాదన్న అతనితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెను. క్రీ.శ. 1674 లో శివాజి పట్టాభిషేకానంతర మతని బొక్కసము చాల తగ్గిపోయినందున మీదికి యుద్ధ సన్నద్ధు లగుచుండిరి.

ఇంతలో మొగలాయి సేనాధిపతి దిలేరుఖాను బిజాపురముపై దండెత్తి వచ్చి వారిని ఓడించి అవమానకరమగు సంధి కొడబడజేసెను. కొన్ని కారణముల వలన బిజాపురమువారు తుదకు మహారాష్ట్రులనే సాయము కోరవలసి వచ్చెను. అందుచేత మాదన్న శివాజిని ఏమియు చేయజాలక పోయెను.

**అగస్త్యుడు** (క్రీ. శ. 1292 - 1323): ఇతడు కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు కాలమున నతని యాస్థానమున నుండె ననియు, ప్రతాపరుద్ర యశోభూషణ మను నామాంతరముగల ప్రతాపరుద్రీయ మను నలంకార శాస్త్ర గ్రంథమును రచించె ననియు ప్రతాపరుద్రీయము నందలి 'కౌన్నత్యం యది వర్ణ్యతే....త త్త్వాం వర్ణయితుం బిభేమి యది వా జాతోఽస్మ్యగస్త్య స్థిత స్త్వత్పార్శ్వే గుణరత్నరోహణగిరే శ్రీవీరరుద్రప్రభో' అను శ్లోకము వలన తెలియబడు చున్నది. విద్యానాథ రచనముగ ప్రసిద్ధి గాంచిన ఈ యలంకారశాస్త్ర గ్రంథము ప్రతాపరుద్రునికి నంకితము చేయబడినది. ఇందలి ఉదాహరణము లన్నియు ప్రతాపరుద్రునే ప్రశంసించుచున్నవి. కావున అగస్త్యుడును, ప్రతాపరుద్రీయ కర్తగా ప్రసిద్ధిగాంచిన విద్యానాథుడును ఒక్కడే యనియు, పాండిత్య ప్రకర్షచేత అగస్త్యునికి విద్యానాథబిరుదము లభించె ననియు భావింపబడుచున్నది. ప్రతాపరుద్రుని యాశ్రితుడును, సౌగంధికాపహరణ కర్త యునగు విశ్వనాథకవి తన సౌగంధికాపహరణమున 'వాచ స్తస్య కవే రుదారమధురా ఇత్యత్ర చిత్రం కిము; ప్రఖ్యాతః....అగస్త్య స్సుధీః....స య న్మాతులః' అని యగస్త్యుడు తన మేనమామ యని వచించినాడు.

ఈ విశ్వనాథకవి శిష్యురాలగు గంగాదేవి తన మధురా విజయ మను వీరకంపరాయ చరిత కావ్యమున

'చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్తవైదుష్య సంపదే:
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్ కోవకోవిదః'

అని అగస్త్యుడు గొప్ప కవి యనియు, డెబ్బదినాల్గు గ్రంథములు రచియించె ననియు పేర్కొన్నది.

వానిలో లభించునవి (1) బాలభారతము. ఇది మహాకావ్యము; మహాభారతకథ యంతయు నిందు వర్ణింపబడినది. దీని ననుసరించి విల్లిపుత్తూరార్ అను తమిళకవి భారతమును తమిళమున రచించెను; (2) కృష్ణచరితము: ఇది యొక గద్యకావ్యము. ఇందు శ్రీకృష్ణుని చరితము వర్ణింపబడినది; (3) నలకీర్తి కౌముది: ఇది నాలుగు సర్గముల ఖండకావ్యము: రెండు సర్గములు లభించినవి. ఇంకను దశావతార స్తోత్రము, లక్ష్మీస్తోత్రము, శివస్తవము, శివ సంహిత, లలితా సహస్రనామము, మణిపరీక్ష, సకలాధికారము అనునవి నామమాత్రము తెలియవచ్చు చున్నవి. ఇంకొక రచనము అగస్త్యనిఘంటువు. ఘనశ్యాముడను కవి తన ఉత్తరరామ చరిత్రవ్యాఖ్యానమున పలుమారీ నిఘంటువు నుదాహరించెను. కాని అది కానరాదు. గ. సు.

**అక్కయసూరి** (అక్షయశాస్త్రి), ఘోటిగుండము: ఇతని తండ్రి పక్షధర యెల్లయార్యునికి సోదరుడైన

వెంకటార్యుఁడు. ఇతడు వెల్లాల ఉమామహేశ్వరునికి (అభినవ కాళిదాసు) గురువు. ఇతని రచనములు తత్వచంద్రిక రత్నావళియను భాగవత చంపుటీక. వ. రా. స్వా.

**అచ్చమాంబ, భండారు** (క్రీ. శ. 1874 - 1905) తొలుదొలుత మహిళాభ్యుదయమునకు పాటుపడిన ఆంధ్ర విదుషీమణులలో భండారు అచ్చమాంబ యొకతె. ఈమె కృష్ణజిల్లా నందిగామలో జన్మించెను. తండ్రి కొమర్రాజు వెంకటప్పయ్యగారు. ఈమె కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి సోదరి. భండారు మాధవరావుగారి మె భర్త. అబలాసచ్చరిత్రరత్నమాలయను పేర రచించిన ఈమె గ్రంథమునందు చారిత్రక కాలమునందలి హిందూ సుందరుల జీవితములు మృదు మధుర శైలిలో వర్ణితములైనవి. ఈమె క్రోషా యల్లికను గురించి కొన్ని వ్యాసములను 'హిందూ సుందరి' పత్రికలో ప్రకటించెను. ఆంధ్ర దేశమున పర్యటించి మహిళాభ్యుదయమును గురించి ఉపన్యాసము లిచ్చియు, పత్రికలకు వ్రాసియు, మహిళా సమాజములను స్థాపించియు ఆంధ్రమహిళల ఉద్ధరణమునకు పాటుపడెను; మధ్యప్రదేశ్ లోని బిలాసపూరులో కీర్తిశేషురాలయ్యెను. మ.సో.శ.



చిత్రము 122. భండారు అచ్చమాంబ

**అజంటా:** చిత్ర, శిల్ప కళలలోని మాధుర్యము నడుగు మోప జుర్రుకొన్నవి అజంటా గుహాలయములు. ఆ యిర్వది తొమ్మిది గుహలలోను 9, 10, 12, 13 సంఖ్యలవి ప్రాతవి. వానిలోను మొట్టమొదటిది పదవ గుహ క్రీ. పూ. రెండవ శతాబ్ది మధ్యమునకు చెందినది. దేశ కాలముల బట్టి చూచినను, అచటిశాసనములను జూచినను అజంటా రూప కల్పనకు ఆంధ్ర శాతవాహనులే అంకురార్పణ చేసినా రనవచ్చును.

ఉత్తర దేశమునుండి వచ్చుచున్న తపతీనది లోయ దాటి దక్కన్ పీఠభూమిని మెట్టుకోట మహారాష్ట్రములోని ఔరంగాబాదుకు 40 మైళ్ళు ఉత్తరముగా తలవాకిలిగా ఉన్న ఈ అజంటా [illegible] యమునుల ఎత్తునుండి ఒక [illegible] క్రిందికి దొరలి 'శాతకుండ' మన్న మడుగై, పొరలి లోయవెంట పారి మందముగా అతి గంభీరముగా ప్రవహించు వాఘోరా నదిలో గలసిపోవును. ఆ కొండ చరియలో అంత పొడవునను అర్ధవలయాకారముగా ఈ అజంటా గుహాలను వెలయించినారు.

బౌద్ధము చిందిన శావులైన యీ గుహాలను అరణ్యములో దాగియున్నవానిని 1819 లో మొదట కనుగొన్నవారు సైనికులు. 1829 లో రాయల్ ఏషియాటిక్ సొసైటి పత్రికలోను, 1843 లో ఫెర్గూసన్ వ్యాసమునందును అజంటాలోని లోభనీయదృశ్యముల వర్ణనములు చూచి కుతూహలియై అచటి చిత్ర శిల్ప ప్రతిరూపములను 1844 మొదలు 1864 వరకును సేకరించి మేజర్ గిల్ లండనులో ప్రచురించినారు. కాని అంతలో లండను అగ్ని కాహుతి కాగా ఆ చిత్రములలో ఐదు మాత్రము మిగిలినవి. ఆ తరువాత 1875 లో గ్రిఫిత్ బొంబాయి చిత్రకళాశాల సాయమున మరల వాని ప్రతులను వ్రాయించెను. అయనే 1896 లో ఇండియా ప్రభుత్వమువారి పేరట అజంటా బౌద్ధ చిత్రములను ప్రచురించెను. 1915 లో హెర్రింగ్ హామ్ వలి మరియొక ముద్రణము వెలి వచ్చినది.

ఇట్లు ప్రపంచ శిల్ప చిత్ర విదు లందరి మనసులు లోగొన్న యీ అజంటా శిల్పము లొక్కనాటివి గావు. వాని నిర్మాణమున తదేక మనస్కులై, తన్మయులై, తజ్ఞులైన చిత్ర శిల్ప కళాభిజ్ఞులు 7, 8 శతాబ్దము లుపాసించి పంచిన ప్రసాదము లవి; క్రీ. పూ. రెండవ శతాబ్ది నంకురించి వాకాటక మహారాజుల కాలమున పల్లవించి, గుప్తరాజ ప్రాభవ దోహదముల పుష్పించి పరిమళించి క్రమముగ 7 వ శతాబ్దాంతమునకు చలనము లుడిగిన యీ గుహాలయములలో చివర చివరవి 1, 2, 26 సంఖ్యలవి.

పశ్చిమ భారతములోని యితర గుహాలయము లున్న చోటులలో గుహాముఖముల నిలిచి ఎదుట చూచినచో కనుచూపు మేరవరకు పచ్చిక బయలు ఆకస మోరగా నున్నంతవరకు కనుపించును. అజంటాలో అట్లు గాదు. చుట్టును అడవులు కొండలు కలసి ప్రకృతి తన బాహువులతో పొదివి గ్రుచ్చి ఎత్తుకొన్న ట్లనిపించును. [illegible]యము లన్ని రెండ్లుగా సాగినను వానిలో చైత్యక, చైత్యముల [illegible] - యని రెండు యం దుండుటచే బౌద్ధ లలిత కళ [illegible]ముతము, తత్త్వము, సంస్కృతి వీని పరిణామ[illegible] తెరుగగోరినవారి [illegible] ఆలయములు పెన్నిధు లగుచున్నవి.

ఈ నిర్మాణములు రెండు తెగలు: 1. చైత్యములు; 2. [illegible] 9, 10, 19, 26 - యని [illegible]